తెలుగుదనం భాసించాలనీ, తమిళవాసన తగలరాదనీ కాబోలు తెలిసీ తెలిసీ ఇంటిపేరు మార్చుకున్నవారు కొందరున్నారు. వారిలో నల్లదీగవారూ, నల్లదీగలవారూ పేర్కొదగ్గవారు. నల్లదీగ, నల్లదీగల - తెలంగాణంలో తెంగళ్ సంప్రదాయానికి చెందిన వైష్ణవులగృహనామాలు. ఇందలి "తీగ" లతావాచకంకాదు. "నల్లదీగ, కులోద్భవం", "నల్లదీగాన్వయం" అంటూ గీర్వాణంలో వీరి గృహనామం కనిపిస్తుంది. ఒకరు ఏకవచనంతో ఏకాకులయ్యారు; ఒకరు బహువచనంతో బయటపడ్డారు. మౌలికంగా ఈ ఇద్దరి ఇంటిపేరూ ఒక్కటే; గోత్ర సూత్రశాఖలూ ఒక్కటే. వీరి గృహనామానికి పూర్వరూపం నల్లమ్+తికళ్. ఇదే ఈనాటి ఉచ్చారణలో నల్లం దిగళ్, నల్లం దిఘళ్. ప్రకాశించే గుణాలుకల (గృహస్థులు) వారు అని ఈ తమిళ పదబంధానికి మౌలికార్థం. తమిళం అనే అర్థంలో తిగుళ భూములు (ద్వి.భార అవతారిక 45.) తిగళగురుని (ఘటికా. 2-180) అన్న ప్రయోగాలు తెలుగు సాహిత్యంలో కనిపిస్తాయి. "తిగుళ్ళ" ఇంటిపేరుగా తెలంగాణంలోకనిపిస్తుంది. తిగళ, తిగుళ=వలసవచ్చిన తమిళుడని అర్థం.

గణ, యతి, ప్రాసాది ఛందోనిర్బంధాలవల్ల ఇంటిపేర్లలో కొన్ని మార్పులు కనిపిస్తున్నాయి. "అమవసనిసి యన్నమాట అలసని పెదనా" (ఒక చాటువు), కాకునూర్యప్ప సుకవి (అప్పకవీయము), శళ్వాప్పెళ్ళ (ఘటికా. 1-67), "తిరుపతి వెంకటేశ కవిధీరుల శిష్యుడ; నాదుపేరు వేలూరి శివరామశాస్త్రి యని లోకము వాకొను..." చెళ్లపిళ్ల వంశస్వామి (రామాయణ కల్పవృక్షము), దామర వేంకట ప్రభువతంసుని వెంగళభూప..." (బహుళాశ్వ. 1-15), "దామర్లాన్వయముం బొగడదగడేధాత్రిన్" (వైది. 1-37), "...అచ్చో! గదవాల కాడ పెద చెద్ద పెసంగము సేస్తడంటారా" (చాటువు), శ్రీ గొడె జగ్గరాయ భూధవ" (శశిరేఖాపరిణయము, పు.2), "కొత్తా వంశ పయోధిచంద్ర" (కె.వి.ఆర్. నరసింహంగారి సుజాత), "కుదురుగదెంచి సత్ఫలము గూర్చిన మా మరిగంటి సత్కవి / ప్రథితయశస్కులన్..." (శ్రీ రఘునందనకుశేశయ ప్రబంధము, 22). అల్లసాని, కాకునూరి, వేలూరి, దామర్ల, గద్వాల, గొడే, కొత్త, మరింగంటి అని అసలు రూపాలు.

భారత జాతీయ స్వాతంత్ర్యసమరంలో భాగంగా సాగిన "వందేమాతరం" ఉద్యమం (1938) లో ఇరవయ్యొక్కటేండ్ల యువకుడుగా స్థిరకీర్తిని గడించిన గద్వాల వాస్తవ్యులు వావిలాల రామచంద్రరావు (1917- )గారి ఇంటిపేరు ఏతదుద్యమ స్ఫూర్తిమూర్తి "వందేమాతరం"గా మారిపోయింది. అనంతపురం జిల్లా బుక్కరాయ సముద్రం వాస్తవ్యులూ, సంస్కృతాంధ్ర హిందీభాషా విద్వాంసులూ; స్వాతంత్ర్య సమరయోధులూ అయ్యిన శ్రీ పోడరాళ్ళ లక్ష్మయ్య భగవద్గీతాది వేదాంతగ్రంథాలకు వ్యాఖ్యానాలు రచించి, ఉపనిషత్తత్వాన్ని జిజ్ఞాసువులలో ప్రవచించి పేరుపొంది నందున వారి ఇంటిపేరు "వేదాంతం " గా మారిపోయింది.

ఉత్తర భారతదేశంలో "ఖత్రి" తెగలలో ఒకరి పట్టపు పేరైన "ఖన్నా"కుగల ప్రచార ప్రశస్తులను గమనించి అచ్చం తెలుగు వారైన "కన్నా" గృహ నామకులు ఈ రెండుపేర్లలో ఉచ్చారణ సామీప్యం ఉండడంచేత పబ్లిసిటీ గొప్పల్లకై పదాది అల్పప్రాణ వర్ణాన్ని మహాప్రాణంగా మార్చుకున్నవైనం లోకానికి తెలుసు. ఏం చేస్తాం? పొరుగింటి పుల్లగూర రుచి! ఇలాగే ఎన్నో తెగలూ, కులాలూ పేర్ల మార్పిడికి మాత్రం ఉద్యమించి అంతతో ఆగిపోవడం శ్రేయం కాదు. వీటిలో చాల భాగం పాతగిల్లి ఆధునికుల దృష్టిలో జుగుప్సనో, నైచ్యాన్నో సూచిస్తున్నమాట నిజమే. పాతపంచారపు దేశవాళీ మాటల పొందిక నచ్చక మెరమెచ్చులకోసం పరభాషలలోని పరిభాషలను ఆశ్రయిస్తున్నారు. వీటిలో కొన్ని ఉపపత్తిపరామర్శ లోపించిన ఊహలు; కొన్ని వ్యుత్పత్తి బలంచాలని వీడివాదాలు; కొన్ని యుక్తి ప్రమాణ కుశలులు అంగీకరించని విపరీతార్థ కల్పనలు; తక్కిన కొన్ని దైన్యాన్ని దాచుకోవడానికి తొక్కిన పక్కదారులు. విశ్లేషించి చరిత్ర గతినీ, సంప్రదాయ పద్ధతినీ విస్మరించిన తొందరపాటు నిర్ణయాలివి. విద్యావిషయక చర్చలలో ఇలాటి మిడిమిడి జ్ఞానపు ప్రతిపాదనలు స్వాగతించరానివి; సమ్మతించరానివి.

సమాజంలో ప్రతివ్యక్తీ, ప్రతివర్గమూ ఉత్తమ స్థాయికి ఎదగాలనీ, ఉదాత్తకీర్తిని పొందాలనీ ఉబలాటపడడం అతి సహజమేగాక, అది అత్యావశ్యకం కూడా. ఐతే, పేర్లు మార్చుకున్నంతమాత్రాన ఎవరి ప్రతిష్ఠా పెరగదు. పెంచుకోదలచడంలో తప్పులేదు. కాని, సమాజంలో తమ ఉనికినీ, మనికినీ భద్రపరచుకోవడానికి వట్టిమాటలు గట్టిమేల్‌తలపెట్టి, పై పైపూతలను వాస్తవమైన ఉన్నతస్థితి నందుకోవడానికి తగినట్టుగా ఆయా వ్యక్తులూ, వర్గాలూ ఆచరణయోగ్యాలైన పథకాలద్వారా, ఆమోదయోగ్యాలైన పద్ధతులద్వారా త్రికరణశుద్ధిగా కృషిచేయాలి. అభ్యుదయంపట్ల ఆసక్తినీ, అందుల కవసరమైన శక్తియుక్తులనూ అన్ని వర్గాలవారూ సమకూర్చుకోవాలి. చిత్తశుద్ధీ, సుస్థిరబుద్ధీ, కార్యనిర్వహణ దక్షతా అమరితే తప్ప లక్ష్యసిద్ధి కలలోని మాట! ఈ వరకే పై అంతస్తులలో ఉన్నవారు తక్కినవారికి చేయూత నిచ్చిపైకి చేదుకోవాలి. అధికార చక్రం చేపట్టినవారు దీనికి వలసిన హంగులనూ అవకాశాలనూ కల్పించాలి. అటుకాక ఆశయాలకూ, ఆచరణలకూ ఆమడల దూరమైతే మన ఊహాలూ, ఉద్యమాలూ అన్నీ వృథా! వృథా!

సముద్రపు లోతులను చూడబోయిన ఉప్పుబొమ్మ ఉబలాటం వంటిది నా ఈ ఉపరిశోధనం "సత్యంజ్ఞానమనంతమ్".

(శ్రీశైలం ప్రాజెక్టులోని ......)

ఉంచవలసి వచ్చింది. ఈ రెండు వైపుల వారి మధ్య దేవాలయం, వాళ్ళ కంటే వాళ్ళకని అంతంలేని న్యాయ యుద్ధం జరుగుతోంది. ఈ సమస్య పరిష్కృత మయ్యే వరకు దేవాలయం పునర్నిర్మాణం సాధ్యం కాదు. సోమశిల సముదాయాన్ని నిల్పడానికి చాలా కాలం పట్టింది. అయితే చివరికి కొత్తగా కట్టిన సోమశిల గ్రామానికి వెలుపల ఒక కొత్త రిజర్వాయరుకు అభిముఖంగా సుందర ప్రదేశం ఎంపిక చేయడమైంది. అలంపురం దగ్గర ఉన్న పాపనాశి దేవాలయ సముదాయం పునర్నిర్మాణ కార్యక్రమం మొదలై పని చురుకుగా జరుగుతోంది. అల్లాగే రూపాల సంగమేశ్వర దేవాలయం పని దాదాపు పూర్తవుతోంది. పెద్ద యెత్తున పురాతన కట్టడాల పరిరక్షక చర్యల్ని భారత ప్రభుత్వం, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించడం ఇదే మొదటిసారి అయి ఉండవచ్చు. దేవాలయాన్ని గుర్తించి, పునస్థాపన జరిగే వరకు ఉన్న మొత్తం పని అంతా భారత ప్రభుత్వ పురావస్తుశాఖ, రాష్ట్రప్రభుత్వ పురావస్తు శాఖ, రాష్ట్ర ప్రభుత్వ దేవాదాయ శాఖ మొదలైన సంస్థలు 300లక్షలరూపాయలఖర్చుతో చేపట్టాయి.

## విడిగా ఉన్న శిల్పాల సేకరణ

మహబూబ్‌నగర్, కర్నూలు జిల్లాల్లోని ముంపు ప్రాంతాల్లో అనేక వందల కొలది విడిగా ఉన్న

(213వ పేజీ తరువాయి)

శిల్పాలను సేకరించి కర్నూలుకు, అలంపూరంకు, హైదరాబాదుకు తరలించడమైంది. తవ్వకాలలో లభ్యమైన పురాతన వస్తువులను ప్రదర్శించడానికి మూడు కొత్త పురావస్తు శాలలు, కర్నూలు, అలంపురం, హైదరాబాద్‌లలో తయారవుతున్నాయి. శ్రీశైలం ఆనకట్ట స్థలంలో మొదటి తరగతి పురావస్తుశాల నిర్మాణాన్ని ప్రతిపాదించడమైంది. సేకరించిన శిల్పాల్లో మహిషమర్దని, భద్రకాళీ, సూర్యుడు, కుబేర, యోగ నరసింహ మొదలైన వారి అద్భుతమైన మూర్తులున్నాయి. ఈ శిల్పాలే కాక ప్రగటూరులోని ద్వార స్తంభాలు తొలి విజయనగర శిల్పానికి కళాఖండాలని చెప్పవచ్చు.

గ్రామాల వారీ సర్వే నుంచి పురావస్తు శాల కట్టేవరకు చేసే పరిరక్షక కార్యక్రమాలకు దాదాపు రెండు దశాబ్దాలు పడుతుంది. ఇందులో అనేక సంస్థల, శాఖల,విద్యావేత్తలు, నిపుణుల, శ్రామికుల కృషి ఉంది. శ్రీశైలం ఆనకట్టవల్ల కలిగిన ప్రయోజనాలకు తక్కువ కాని ప్రయోజనాలే ఈ పరిరక్షక కార్యక్రమాల వల్ల కలిగాయి.

* * *

